## అయిదవ యధ్యాయము

---

### జనులు-జాతులు-వృత్తులు.

౧. బండారము, పచ్చికబయలు, జనులు.—1895 వ సంవత్సరపు లెక్క ప్రకారము గ్రామమున 155 బండ్లు, 577 మడకలు, 1 నీలితొట్టి, 5 గానుగలు (ఇందు నూనె గానుగలు చెఱకు గానుగలు చేరినవి), 172 మగ్గములు (కంబళి దూది మగ్గము లిందు చేరినవి) నుండెను. జంతు సముదాయమున - ఎద్దులు ఎనుప పోతులు 1311, ఆవులు 587, ఎనుములు 681, నాలుగేండ్ల యీడునకు లోఁబడిన దూడలు 618, గొఱ్ఱెలు మేఁకలు 1017, గుఱ్ఱములు 9, గాడిదలు 58, ఉండినవి. పశువులకు చేలయందు గడ్డియు, చెఱువునను జలాధారములలోను నీరును, లభించుచుండెను. కాని పచ్చికబయళ్ళు వేఱుగా నాఁటికిని నేఁటికిని ఏర్పడి యుండలేదు. 1911వ సం॥లో 3645పురుషులు-3741 స్త్రీలు-మొత్తము 7286 జనులుండిరి. ఇందు 6070 హిందువులు-1286 మహమ్మదీయులు-29 క్రైస్తవులు- 1 ఇతరులు. నాఁటి లెక్క ననుసరించి యిచ్చట జనులు కాఁపురముండెడియిండ్లు 1583. 1919 వ సం॥ రమున 2158 నివాసగృహము లుండినట్లు తెలినది.

౨. అభివృద్ధి.—ఇప్పటి (1919 వ, నాఁటి) కిరువది యైదు సంవత్సరముల క్రిందటికంటె, నీ గ్రామము నేఁ డెక్కువ వృద్ధిదశయం దున్నదని చెప్పవచ్చును. నాఁ డీ గ్రామ మింతటి గృహసంఖ్యను జనసంఖ్యయుఁ గలిగి యుండలేదు. మఱియు నీపురమునఁ బూరిగుడిసెలే మెండుగా నుండినవి. అంగళ్ల వాడయందు సహితము మిద్దెటిండ్లు మిగులఁ గొలఁదిగాఁ గానిపించు చుండెను. ఈ గ్రామమునం దంతటను మొత్తమున నాలుగు మేడలకంటె హెచ్చుగా లేకుండెను. వ్యవసాయాభివృద్ధి మిక్కిలి తక్కువ. ఆ దినములయందు పౌరులలో, అన్ని తెగలవారిలోను బీద లెక్కుడుగా నుండిరి.



వారి కష్టాలు పుట్టుట దుస్తరముగ నుండెను. స్వల్పఋణమున కెన్నియో కట్టుబాట్లును ప్రయాసములును నుండెడివి. ధనికులు తమ క్రింది ఋణస్థుని బానిసవలె భావించుచుండిరి. ఋణగ్రస్తుఁడు పెంపొందుటయే కష్టముగా నుండెను.

ఆ దినములలో నిచ్చటి ముఖ్యమయిన చేతిపని నేఁతయే; అయినను నూలుబ్రతుకు విస్తారముగను పట్టు నేఁత బహుస్వల్పముగను నుండినది. నేఁతగాండ్రలో నిరుపేదలు విరివిగ నుండిరి. ఈజనులలో తలరుమాళ్లు కొనుటకయిన శక్తి చాలనివార లనేకులు. వీరిలోఁ గొందఱు మర్యాదగల చోటికి వెళ్లవలసి వచ్చినపుడు, తమయొద్ద నుండిన నూలుపడుగులనే చుట్టుకొని పోవుచుండెడివారు. విద్యావిషయమున సహిత మిది చాల వెనుకఁ బడియుండెను. స్వభాషను మాత్రము నేర్పు వీధిబళ్లు రెండు మూఁడుండినవి. అప్పుడప్పుడే యినుపదారి యేర్పడి యుండుటచేతను, ఇతర ప్రాంతజనులతో నిచ్చటివారి కెక్కుడు సంబంధము కలుగకపోవుటవలనను, వ్యాపారవృద్ధికి మార్గము లేకుండుటయే గాక జనులకు వ్యాపారసౌలభ్యము కూడ తెలిసియుండెడిది కాదు. నాఁ డిచ్చట లోహ విక్రయ నిషద్యాలు రెండును, వస్త్రాపణములు రెండును నుండినవి. తక్కినవన్నియుఁ జిల్లర యంగళ్లు. అప్పటికి మద్యాపణ మంగళ్ళ వాడయందే యుండెను. వయసు చెల్లినవారును, దేవీభక్తులలోఁ గొందఱును మాత్రము గోప్యముగ-బహుస్వల్పముగ-దానిని (మద్యమును) స్వీకరించు చుండిరి; కనుక నా దినములయందుఁ ద్రాగుఁబోతుల సంఖ్యయు నత్యల్పముగానే యుండెను.

3. భాషలు.—ఇందలి ప్రధానభాష తెలుఁగు. బ్రాహ్మణులు కొందఱు కన్నడమును-మహమ్మదీయులు తుఱకమును - మరాటీలు మహారాష్ట్రమును గృహభాషగా వాడుకొనుచున్నారు. కార్యాంతరులై వచ్చి యిచ్చట నివాస మేర్పఱచుకొని యుండు దాక్షిణాత్యులు ద్రావిడమును, మార్వాడీలు మార్వాడీ భాషయు వాడుచున్నారు. రాజకీయ విషయములయం దాంగ్లమే యుపయోగింపఁబడు చున్నది.

౪. నాగరకత.—నగరవాసుఁ డయ్యును సదాచార సంపన్నుఁడు గాక, కేవలము ఉడుపుల సింగారమును బట్టియే నాగరికుఁ డనిపించుకొనుచోడల, నట్టి వేషమే యుత్తమనాగరకతకు సంపూర్ణలక్షణ మని తలంపఁ జాలము. సదాచారశీలుఁ డగు గ్రామ్యుఁ డనాగరికుఁ డనియు భావింపఁ జాలము. నాగరకత వట్టి బాహ్యవేషముననే గాక, ముఖ్యముగ నాచారమునను సమ్మిళితమై యుండుట బాగు. ఇట్టి ఆచారము అనాచారము అను మాటలనే సులభమైన యర్థమునఁ జెప్పవలసి యున్నప్పుడు, మడి మైల యని యందుము. ఈమడి మైల విషయములోఁ గొందఱి భావము మిక్కిలి సంకుచితముగను భిన్నముగను నున్నది. శూద్రునియాచారమును బ్రాహ్మణుని యనాచారమును నుప్పునకు మూల మనునుడి, సర్వసామాన్యముగా జనులందఱిలోను బ్రాఁకికొనియున్నది. బ్రాహ్మణుఁ డాచారవంతుఁడుగ నుండి తీరవలయు ననియు, శూద్రుఁ డట్లుండనే రాదనియు నిందలినిశ్చయార్థము; కాని శూద్రుఁ డాచారవంతుఁడుగ నుండనే రాదనుటకంటెను, ఆచారవంతుఁడుగ నుండుట యతనికి సులభసాధ్యము కాదని చెప్పుటలోఁ గొంచెము గుణ ముండునేమో. ఎట్లైనను బైవాక్యము నిమ్నుల నుద్ధరించుట కెంతమాత్రమును దోడ్పడఁ జాలదు. కనుక నిది విశాలహృదయుని నిర్మలభావము కానేరదు. ఉదయమే లేచి, సచేలస్నాన మాచరించి, నుదుట విభూతి నలఁది, సంధ్యాదిక్రియలఁ గావించి, నిర్మలవస్త్రములను ధరించుట మాత్రమే యాచారమున కర్థమని తలంచువారు పెక్కండ్రు. ఆచారమునం దిది యొకభాగము కావచ్చును; కాని యిందుచేతనే యది పూర్తియైనదని తలంచుట పొరబాటు. 'ఇన్ని యాచారములలోన నెక్కుడండ్రు సకల భూతంబులందును సదయుఁ డగుట' ఇత్యాది పూజ్యవచనములు పవిత్రాచారమునకుఁ బ్రమాణములు. ఇట్టి యాచారప్రియు లగు నాగరికు లిచ్చట మిక్కిలి తక్కువ.

౫. జాతులు.—జాతుల తెగ లనేకములు. అందు ముఖ్యులు బ్రాహ్మణులు. చిరకాలము నుండియు మిక్కిలి వన్నెకెక్కిన బ్రాహ్మణోత్తముల



కిది వాసయోగ్యముగ నుండెను. తొల్లింటి బ్రాహ్మణులలో వైదిక మండలికిఁ జెందిన పండితు లత్యంత ప్రజ్ఞానిధులుగ నుండిరి; కనుకనే మఠాధిపతులు సహితము, ఆచార వ్యవహార ప్రాయశ్చిత్తాద్యధికారములను సంపూర్ణముగ వైదికులకే యొసంగియుండిరి. ఆయధికారగౌరవము మాత్ర మిప్పటికిని వైదికుల కున్నది. ఇందలి తదితరజాతుల తెగలు అగసాలె, ఈడిగ, ఉప్పర, ఒడ్డె, కమ్మర, కాఁపు, కుమ్మరి, కురుబ, కోమటి, క్రైస్తవ, గాండ్ల, గొల్ల, గౌని, చాకల, జంగము, తుఱక, తొగట, దేవాంగము, పట్టేకారి, పింజరి, బలిజ, బెస్త, బోయ - భట్టు, భోగము, మంగలి, మరాటి (ఆరె), మాల, మాదిగ, మేదర, లింగధారి, వడ్రంగి, సాతాని, సాలె మొదలయినవి.

౬. వృత్తులు.—ఇందలి యగసాలె, కమ్మరి, వడ్రంగి, తెగలు, అలంకారములు-సేద్యపుఁ గొఱముట్లు-ఇంటిపనిముట్లు చేసి, యందువలన జీవించుచున్నారు. ఈడిగ, కాఁపు, తుఱక, బలిజ, మరాటి, మాదిగ, మాల (చాలవఱకన్ని) జాతులవారు, కృషి నుత్తమజీవికగాఁ జేసికొని యున్నారు. ఉప్పర, ఒడ్డె, గొల్ల, పింజరి, బోయ తెగలు కూలివలనను ఱాలఁగొట్టి యిండ్లు కట్టుటచేతను జీవించుచున్నారు. తొగట, దేవాంగము, పట్టేకారి, సాలె తెగలకు గుడ్డలు నేయుట ముఖ్యజీవికగా నున్నది. భోగము గీత నృత్యాది విద్యలఁ గఱచుటయు, సాతాని నీలి యద్దుట గుడ్డలు నేయుటయు, గాండ్ల నూనె తీయుటయు, కిరస్తాని మతవిషయమై ప్రసంగించుటయు, నాయా తెగలకు ముఖ్యవృత్తు లగుచున్నవి. మేదరి బుట్టలల్లును. తుఱక మరాటి తెగలలోఁ గొందఱు గుడ్డలు కుట్టుదురు. కుమ్మరి, చాకలి, మంగలి జాతులవారు కులోచితవృత్తులను నడపుదురు. కోమటులకు వ్యాపారము ముఖ్యము. బ్రాహ్మణులలోఁ గొందఱు ప్రభుత్వసేవకోద్యోగములవలనను, మఱికొందఱు క్షేత్రార్జితములగు భూముల యాధారమువలనను జీవించుచున్నారు.

౭. కృషి.—అన్ని వృత్తులలోను కృషిని బోలినది లేదనుట బహుజనాభిప్రాయము. ఇది లక్షణకర మయినదియు లోకరక్షణకర మయి

నదియై యున్నది. 'కృషితో నాస్తి దుర్భిక్షమ్' 'కృషి వాణిజ్య గోరక్షాః సర్వేషామ్ శ్రీ సమృద్ధిదాః' 'శ్రీకృషి సర్వమానవులు చిత్తమునం గొని మేలుగాంచుఁడీ' మున్నగు వచనములవలనఁ గృషి సర్వమానవులకు నుత్తమవృత్తి యగుచున్న దనియు, నిది యన్నాయసంపాదనమునకు ముఖ్య సాధన మయినదనియు, నేర్పడుచున్నది. కాని, కృషి నవవికర్మలలోఁ జేరు చున్నది; కనుక గృహస్థున కిది వర్జనీయ మయియున్న దని, మానవ ధర్మ చంద్రిక ' ప్రబోధించు చున్నది. మఱియు బ్రాహ్మణుఁడు కృషి చేయుట మహాపాతక మనియు, కర్షకుఁడు బ్రాహ్మణునకు ధాన్యము దాన ముచేయకుండుట బ్రహ్మహత్యాదిదోష మనియు, అది శాసించు చున్నది. కృషి గృహస్థునకు వర్జనీయ మయి యుండఁ గర్షకుఁడు ధాన్యము దానము చేయుట యెట్లు పొసఁగును? బ్రాహ్మణుఁడు కృషి చేయుట మహాపాప మగు నేని, పరుల సొమ్మున కాసించక కష్టమును దలంపక, భార్యాపుత్రు లతో జీవమాన పర్యంతము సేద్యముచేసి, గ్రాసము గడించిన బమ్మెరపోత నార్యుని గతి యేమి? ఈ మానవధర్మచంద్రికా శాస్త్రములోని పాపనిరూ పణ ఘట్టముల నాతఁడు చూచి యుండలేదు కాఁబోలును!

౮. చేతిపనులు.—ఇచ్చటి చేతిపనులలో నేత చాల ముఖ్యమయినది. ఈ వృత్తియం దిది చెన్నపురి రాజ్య భాగమునకుఁ గేంద్రస్థాన మని చెప్ప వచ్చును. ఇప్పటికి రమారమి నూఱు సంవత్సరములనుండి యీ గ్రామమున నేత వాడుకలో నున్నది. కదిరి తాలూకా కుటాగుళ్ళ ప్రాంతముల యందు లభించు చుండిన 'కదిరి కోర ' యనఁబడు ముతుక పట్టు (Rough silk) వలన నిచ్చటి వారు 'తెల్లపూల చీర ' 'కలిపూల చీర ' 'పీతాంబ' రాదు లను మిక్కిలి యరుదుగ నేయుచుండిరి. ఎఱుపు పట్టులో నల్లనినూలు మిశ్ర మముచేసి, ఊదావన్నె గల తల రుమాళ్ళను సహితము సిద్ధము చేయుచుం డిరి. ఆకాలమున నిచ్చట పట్టు నేతమగ్గము లొకటి రెంటికంటె నెక్కువ లేకుండెను. కదిరి కోర నిలిచి పోయిన తర్వాత నిచ్చటివారు చిన్న బళ్ళా పురము - బెంగుళూరు మున్నగు చోట్లకు కాలినడకతో వెళ్ళి, తమకుఁ గా



వలసిన పట్టు తెచ్చుకొను చుండెడివారు. ఇప్పటి కిరువది యయిదు సంవత్స రముల క్రిందట కూడ, పట్టునేత మిక్కిలి తక్కువగనే యుండెను. అప్పు డీ గ్రామమున నేత మగ్గములు నాలుగయిదు మాత్రమే యుండినవి. నాఁటి దినములలో నూలు నేత విస్తారముగా నుండెడిది. ముతుక నూలు వలన తెల్ల చీరలు దుప్పటి పోరువలు చల్లడపు గుడ్డలు సహితము నేయఁబడు చుండెను. నాలుగయిదు రూపాయలకు మించని 'మూకంచు-గుండ్లంచు' నూలు కోకలును, ఇరువది రూపాయలకు హెచ్చని 'ఆనెబొప్పళి-పుటాని బొప్పళి' యను పేరుగల పట్టుచీరలును విశేషముగా వాడుకలో నుండెను. ఇప్పుడు వాని రూపు మాసినది. ప్రకృత మీగ్రామమం దంతటను, పట్టునేత మగ్గములే వ్యాప్తిఁ జెందినవి. నూలు చాల యరుదయినది. బహువిధ వర్ణ ములును విలువలును గల, పట్టుదుకూలము లనేకము లిప్పు డిచ్చట సిద్ధమగు చున్నవి. అన్ని కడల నీయూరి చీర లెక్కుడుగఁ బ్రసిద్ధిఁ గాంచినవి. జరీలో మంచి బుటేదారీపని చేయుటకు, తగిన సామర్థ్యము గల నేర్పరు లిచ్చట నున్నారు. చెన్నపురి పారిశ్రామిక సంఘము (Industrial Association Madras) వారి జాతీయనిధి (The National Fuud) పక్షమున, అఖిలభారత తంతువాయుల పోటీపరీక్ష (All India Weaving Compitetion), 1908 వ సంవత్సరమునందు చెన్నప్రోలున జరగినది. ఆపరీక్షకు హిందూదేశమునందలి బరోడా మున్నగు ననేకస్థలములనుండి, తంతువాయులు విస్తారముగాఁ బ్రయత్నించి, చెన్నపట్టణమునఁ జేరి యుండిరి. అట్టి సందర్భమున నీ ధర్మవరము నుండియుఁ గొందఱు నేతగాండ్రు చెన్న పట్టణమునకు వెళ్లి, యందుఁ దమ సామర్థ్యముఁ జూపి, సోదర జనులతోఁ బాటు తాము నుబతకములను, ధనరూప మగు నుచితపారితోషికములను బొందియున్నారు.

౯. బాటలు.—బుక్కపట్టణము పెనుగొండ కల్యాణదుర్గము అనంత పురము తాడిపత్రి గ్రామముల బండిబాట లిచ్చట కలియుచున్నవి. నేఁటి కిరువది యాఱు సంవత్సరముల క్రిందట ౯/—33/8" వృత్త పరిమితిఁ

గల మూఁడినుపదారు లిచ్చట నేర్పడినవి. ఇందు మొదటిదయిన గుంతకంటి మార్గమున, 1892 వ సం॥రము మార్చి నెల 1 వ తేదీన మొట్టమొదటి బండి బయలుదేరినది. తరువాత నిరువది దినములకు, మార్చి నెల 20 వ తేది వాయల్పాడునుండి యిచ్చటికి, రెండవ మొదటిబండి నడచినది. పిమ్మట నొక యేఁడాదికిఁ బయిన నిచ్చటినుండి హిందూపురమునకు, 1893 వ సం॥రము ఏప్రిలు నెల 28 వ తేదీన మూఁడవ మొదటిబండి వెళ్లినది. ఇట్లు పొగబండ్లు బయలుదేరిన దినమున, జనులాయా కార్యస్థానముల యొద్ద విస్తారముగ గుమిగూడి, మహాసంతోషముతో వాని పోకడఁ జూచుచు, ఫలపుష్పాదులను విరివిగ (వానికి) సమర్పించి, వినోదించిరి. ఈ సంధి స్థానమున నొక విదేశ భోజనశాల యున్నది. నేఁటికి నాలుగు సంవత్సరములక్రిందట, స్వదేశ భోజనశాల సహిత మొకటి నెలకొల్పఁబడినది. ఇందలి యుద్యోగీయుల యుపయోగార్థమయి, యొక యుచిత వైద్యశాల యున్నది. ఇటీవల యైరోపా మహాసంగ్రామ కారణమున, గుంతకంటి నుండి బెంగుళూరికిని ముఖ్యముగా బెంగుళూరి నుండి గుంతకంటికిని - బోయెడి శకట పంక్తులలోఁ గొన్నిఁటి నాపియుంచుటతోఁబాటు, టిక్కెట్ల ధరయు వృద్ధి నొందినది. కాని స్థలాభావముచేత జనులీబండ్లలో మిక్కిలి త్రొక్కట బడుచుండుట మాత్రము తగ్గలేదు. రైల్వేవారు లీ విషయమయి తగిన సౌకర్యముల నొనర్చుట యుక్తము. ఇనుపదారి యేర్పడి, మండలాంతర వాసులతో సంబంధ మెక్కుడయిన యనంతరమే, యీ గ్రామము సర్వ విధముల నభివృద్ధి నొందెననుట యతిశయోక్తి కాఁజాలదు.

౧౦. ఎగుమతులు.—ఇచ్చటినుండి వడ్లు విశేషముగా నితర చోట్లకుఁ బంపఁబడును. ఇందలి మంచినూనె మిక్కిలి ప్రశస్త మయినది. ఉలవలు మిక్కుటముగా బళ్ళారికిని - చెన్నపురికిని - ఎగుమతి చేయఁబడును. నానావిధములగు పట్టుగుడ్డలిందు నుండి పలుతావులకుఁ బంపఁబడుచున్నవి.

౧౧. మరలు — ఈయూరియం దిటీవల సెనగకాయల మరలు మూఁడు స్థాపింపఁబడినవి. ఈమూఁడింటికిని జాలినంత పని యుండినట్లు



తోఁచదు. ఇందులో నొకటిరెండు వడ్ల యంత్రములుగాఁ గూడ నుపయోగింపఁబడుచున్నవి.

౧౨. మత్తుపదార్థములు — అభిని, గాంజాయి, కల్లు, సారాయి, మున్నగు మత్తుపదార్థము లిచ్చట నుపయోగింపఁబడుచున్నవి. ఇందు కల్లు సారాయి మఱియు బీరు విరివిగ విక్రయింపఁబడును. కఱవు దినములలోఁ గూడ నీవ్యాపారము తగ్గినది కాదు. కూటికి-గుడ్డలకు- మాత్రము కఱవు గల్గినను, మత్తువస్తువుల కేమాత్రమును గఱవు రాలేదు. ఈ పదార్థములు బండ్లకొలఁది దిగుచునే యున్నవి. వానిని బుడ్లకొలఁది జనులు త్రాగుచునే యున్నారు. దారిద్ర్యదేవత వెంబడించుచునే యున్నది. ఇందుల కొక చిన్న నిదర్శనము చూడుఁడు. 1908-909 సంవత్సరముల నడుమ యు-పి-20 డిగ్రీల ఘాటుగల సారాయి, డ్రాము 1 కి రు 0-2-8 ల వెల యుండెను. ధరఖాస్తుదారుఁడు నెలకు రూ 178 లు మాత్రమే చెల్లించుచుండెను. సంవత్సరమునకు దాదాపు 810 గాలనుల సారాయి వ్యయమగుచుండెను; కాని అయేట ధరఖాస్తుదారున కాదాయము లేదు. 1919 వ సంవత్సరమున నీపదార్థము యు. పి. 30 డిగ్రీల ఘాటునకుఁ దగ్గింపఁబడెను. విలువయు హెచ్చు చేయఁబడెను. ధరఖాస్తుదారుఁడు చెల్లింప వలసినది నెలకు రు 675 లు గా నుండెను; కాని సంవత్సరమునకు దాదాపు రెండు వేల గ్యాలనులు వ్యయమగుచున్నట్లు మదింపు చేయఁబడెను. కనుక ధరఖాస్తుదారున కెక్కువ యాదాయమే గిట్టుటకుఁ గారణ మయ్యెను. మత్తు తగ్గించుటవలన నిది జనుల కంతబాధాకరముగా నుండదనియు, వారి త్రాగుడును బూర్తిగాఁ దొలఁగించుటకయి వెలకూడ హెచ్చుచేయుచున్నా మనియు, దొరతనము వారనుకొనవచ్చును. ద్రావకము నందలి ఘాటును తగ్గించి వెల హెచ్చుచేయుటవలన, సామాన్యజనులు దాని నధికముగాఁ గొని త్రాగఁజాలరు. కనుక, జనులలో మధుపానమును గ్రమక్రమముగా క్షీణింపఁజేయుట కిది మంచి యుపాయముగ నున్నదని, ప్రభుత్వము వారు తలంప వచ్చును; కాని అది యట్లు జరగుట లేదు. ద్రావకముయొక్క-

మత్తు 20 డిగ్రీలనుండి 30 డిగ్రీలకు దిగినను - డ్రాము వెల రు ౧-2-8 నుండి రు 0-4-0 ల కెక్కినను - నాఁటికన్న నేఁడు విక్రయింపఁబడెడు గ్యాలనుల సంఖ్యకు మాత్రము, తఱుగు రాలేదు; కావున లాభమునకును గొఱఁత లేదు. పదిసంవత్సరములనాఁడు 20 డిగ్రీల ఘాటుగల సారాయి నొకఁడు 1½ డ్రాము మాత్రము పుచ్చుకొని తృప్తి పడుచుండెను. ఇప్పుడు ఘాటు తగ్గింపఁబడుటచేత, నాఁడు 1½ డ్రామువలనఁ దృప్తిపడు చుండినయతఁడు, అదే మత్తు గలుగుటకై నేఁడు 2¼ డ్రాముల ద్రావకము త్రాగుచున్నాఁడు. కొందఱింకను హెచ్చుగనే త్రాగుచున్నారు. నాఁడు నాలుగణాలు వెచ్చపెట్టుట కష్టముగ భావించినవాఁడు కూడ, నేఁడు దినమునకు పది పన్నెండణాలు వ్యయముచేయుటకు సులభముగ వాడుకపడియున్నాఁడు. 1909 వ సం॥ రమున 800 గ్యాలనులు వ్యయమగు చుండిన సారాయి, 1919 వ సంవత్సరమున రెండువేల గ్యాలనులకుఁ బెరుఁగుటయే యిందులకు నిదర్శనము. వెల హెచ్చుచేయుట జనులను బాగుచేయుట కని ప్రభుత్వమువారు తలంచిన తలంపు, వారి యాయవృద్ధికిని జనుల వినాశమునకును మిక్కిలి కారణమగుచున్నది; కావున నిందు విషయమై అమెరికా రష్యాపాలకులు చూపిన యుత్తమత్యాగమును, ఆంగ్లపాలకులు సహితము ఇంకనైనఁ జూపి, మత్తుపదార్థ విక్రయమును బూర్తిగా మాన్పించి, జనుల నుద్ధరింపఁ బ్రార్థితులు.

---

## ఆఱవ యధ్యాయము

---

### పాఠశాలలు - కట్టడములు.

౧. పాఠశాలలు.—ప్రకృత మిచ్చట నొక లండన్ మిషన్ సంఘమువారి పాఠశాలయు, ఒక స్థానికసంఘమువారి పాఠశాలయు, రెండు బాలికా పాఠశాలలును, రెండు రాత్రిబడులును, మూఁడు వీధిబళ్ళును,



ఉన్నవి. ఇవి గాక మహమ్మదీయపాఠశాలలు రెండు (బాలకుల కొకటియు బాలికల కొకటియు) ఉన్నవి. మిషన్ పాఠశాల సుమారిరువది సంవత్సరముల నాఁడు, రెవరెండు విల్లియము హింక్లి దొరవారిచే నెల

౭ వ పటము.

రెవరెండు విల్లియము హింక్లి దొరవారు.



కొల్పఁబడినది. మొట్టమొదట నిది యొక చిన్ని యద్దెయింట స్థాపింపఁబడి, మొదటియేఁట బదిరూపాయలు మాత్రము, సాహాయ్యధనము (Grant) పొంది యుండెను. ఇందులకు గాను మూఁడువేల రూపాయల వ్యయముతో 1910 వ సం॥రమున నొక భవనము కట్టఁబడినది. 1918 వ సం॥ ర

మున నీ పాఠశాల రు 730 ల సాహాయ్యధనము (Grant) పొందినది. ప్రకృతము దీని యభివృద్ధికై శ్రీ ఎఫ్ ఎల్ మార్లర్ దొరవారు శక్తివంచన లేక, సర్వవిధములఁ బరిశ్రమము సల్పుచున్నారు. 1915 వ సం॥ రము సెప్టంబరు నెలలో స్థానిక పాఠశాల యేర్పడినది. బాలికాపాఠశాలల రెండింటిలో నొకటి మిషన్ వారిది. రెండవది స్థానిక సంఘమువారు 1919 వ యేట స్థాపించినది. రాత్రి పాఠశాలలు రెండును కీర్తిశేషులైన టి. ఎన్. వేంకటస్వామి నాయఁడుగారిచే, సంఘసేవాసమితి పక్షమున 1917 వ యేట నెలకొల్పఁబడినవి.

౨. ప్రాతకట్టడములు — ఇచ్చటి యుప్పరిగలు రెండును ప్రాచీన నిర్మాణములే. ఇందలి పెద్ద యుప్పరిగ రెండంతస్థుల మేడ. శిథిలరూపమును దాల్చుచున్నది. (రెండవపటమును జూడుఁడు.) చిన్నయుప్పరిగ యనఁబడు రెండవకట్టడము కూడను ఖిలమగుచున్నది. (మూఁడవపటమును జూడుఁడు.) ఇచ్చటఁ బ్రతివత్సరమునను కార్తీక శు ౧౫ నాఁడు, నేతిలోఁ దడిపిన క్రొత్త తలపాగా నొకటిని దగులఁబెట్టుట, యాచారమయి యున్నది. దేశాయి నారాయణప్ప కట్టించిన సత్రము పేటలోఁ బాడుపడియున్నది. ప్రాతకచేరి యనునది నేలసమ మయినది. ఇది కోటలో దేశాయి నారాయణప్ప మేడ కెదురుగానుండెను. రాచనగరు పెద్ద యుప్పరిగకుఁ బశ్చిమభాగమున కొన్ని గజముల దూరములో నుండినది. అది కూడ సంపూర్ణముగ శిథిలమయినది. రెండవ పటమునం దొక తిప్పవలె కాన్పించునది దీని ఖిలభాగమె. దీని గోడముక్కలపై నొకశిశువు కూరుచుండి యుండుట మీ రందుఁ జూడ వచ్చునేమొ. చరిత్రరచనకాలమున నిది పునాదిభాగము మాత్రము కాన్పించుచుండెను.

3. సత్రములు.—ఇచ్చట పది సత్రము లున్నవి. గొప్పవా రుండుటకును బీద లుండుటకును జనులు వినోదార్థమయి విహారము వెళ్లినప్పుడు వంటలు చేసికొనుటకును బాటసారులు దిగుటకును ఇతరులు బాడుగ కిచ్చి లాభము పొందుటకును ఏర్పడినవి కూడ నిందు చేరినవి. పరదేశులగు యాచకు లుండుటకు మిక్కిలి యుపకరించునది, అడ్డగిరి కృష్ణప్పగారి సత్రము.

౪. సమాధులు — ఇందలి సమాధు లెనిమిది. వీనిలోఁ గొన్నింటఁ బ్రతిదిన దీపారాధన జరగును. కొన్నింటియందు సంవత్సరమున కొక్కపర్యాయ మారాధనమాత్రము జరగును. ఇవిగాక మఠములు-సాముగరిడీలు- కొన్ని యున్నవి. మఠములు లింగధారులకు సంబంధించినవి. సాముగరిడీలు ప్రకృతము పాడుపడినవి.

౫. మసీదులు—మహమ్మదీయప్రార్థనాలయ మగు జుమ్మామసీదు పేటలోఁ గొలఁది కాలము క్రిందటఁ గట్టఁబడినది. నమాజు కట్ట గ్రామమునకుఁ బశ్చిమమున నున్నది. మహమ్మదీయులు సంవత్సరమునకు రెండు మారు లిచ్చటఁగూడి, ప్రార్థనలు సలుపుదురు. గ్రామమున పీర్లచావడు లెనిమిది యున్నవి.

౬. దేవాలయములు—ఇందలి దేవాలయముల సంఖ్య ముప్పది. పేటలోనివి 18; కోటలో నుండునవి 11; పురబాహ్యమునఁ గలవి 6. ఇందు క్షుద్రదేవతాలయములు సహితము చేరినవి. వీనిలోఁ గొన్నింటియందు దినపూజయుఁ గొన్నింటిలో వారపూజయుఁ గొన్నింట సంవత్సరపూజయు జరగును. దీపారాధనమాత్రమే చేయఁబడునవి కొన్ని యున్నవి. మఱియు నిందు పూజాదులులేక నామకార్థముగ నుండెడి యాలయము లేదు.

హట్టీవారి శివాలయము—ఇది యూరి ముందటి మరవ దగ్గఱ, చెఱువునకుఁ బడమటి గట్టునఁ బూర్వాభిముఖముగా నున్నది. ఇందలి లింగము కాశినుండి తేఁబడినది. హట్టీ సుబ్బరాయఁడుగారు కాశీక్షేత్రమునకుఁ గాలి నడకతో వెళ్ళి లింగమును దెచ్చిరి. వారిట్లుపోయి వచ్చుటకు మూఁడు సంవత్సరముల కాలము పట్టినది. ఆసందర్భమున వీరికుమారులు శివరామప్పగారు ధర్మవరమున సిరస్తాదారు పదవియందుండి, యాలయమును నిర్మించి, 1850 వ సం॥ రమున, శివలింగము నందుఁ బ్రతిష్ఠ చేయించిరి.

౭. మాన్యములు— ఆలయములను నిర్మించి, యందు విగ్రహములను నెలకొల్పి, పూజాదులు సక్రమముగ నడచుటకై-ప్రతిష్ఠాపకు లారగింపునకయి-మాన్యక్షేత్రముల నుంచుట వాడుక. ఒకభక్తుఁ డిట్లు నేలతీసి, యందాలయములనునిర్మించి, విగ్రహములను నెలకొల్పి, మహావైభవముతో సమారాధనలఁ గావించి, మాన్యముల నేర్పఱచుట, నామప్రతిష్ఠకే కదా? మన యర్చకులలో సీతత్వము నెఱిఁగి దానిఁ బాలించువా రెందఱు? వర్తమాన కాలమున నాలయముల యందలి విగ్రహప్రభావముల కంటెను, పూజారుల మహిమయే హెచ్చిపోయినది. ఈగ్రామమునందలి కన్యకా పరమేశ్వరీ యాలయమునకు, 1906-907 సంవత్సరములయందు, రంగయ్య యను పేరుగల బ్రాహ్మణుఁ డర్చకుఁడుగా నుండెను. దేనికి రంగయ్యగారు నిత్యాభిషేక క్రియల నెంత చక్కఁగా నెఱవేర్చి యలంకరించుచుండిరో గాని, యతని యర్చనావిధానమును గూర్చి మాత్రము, చాటువుగాఁ గొన్నివాక్యములు బయలుదేఱియుండినవి. కొంతకాలము క్రిందట నొకవిలేఖకుఁ డాంధ్రపత్రికకు వ్రాసినట్లు, భక్తులిచ్చిన మాన్యములను ధనవంతులు వడ్డిభోగ్యముల కుంచుకొని, వానిని న్యాయస్థానముల కెక్కించి, యందు వేలము పాడించి, కొనకు తామే యాక్రమించుకొనుచున్నా రనుట నిజము; కాని యినాములను ధనవంతులు లాగుకొని ధర్మకర్తల కీర్తిఁ బాడుచేయుచున్నా రని, ధనవంతులఁ దెగడుట బాగు కాదు. ఇందులకుఁ బునాదిపురుషులు పూజారులై యున్నారు. ఆరాధన లపహాస్యము లగుచున్నవి. దత్తక్షేత్రములు నానాఁటఁ దగ్గిపోవుచున్నది. ఈలోపములను సవరించువారే లేనందున నవి గబ్బిలముల కునికిపట్టు లయి పాడువడుచుండ, నవీనాలయము లింకను బెరుఁగుచుండుట విపరీతము. చివర కివి యన్నియు శూన్యములయి, ఱక్కలకును గోక్కురాజులకును ఖరాళికిని వాసస్థానములయి, వెనుకటివాని ననుకరించునేమోయను సంశయము పొడముట సహజము; కనుక నిట్టిక్షుద్రదానములకయి నిరర్థకముగ వెచ్చింపఁబడెడు ద్రవ్యము, బీదబాలజన విద్యాభివృద్ధికయి వినియోగించుట మిక్కిలి క్షేమకరము.



౮. ఉత్సవములు— ఇచ్చటఁ బ్రతివత్సరమునను క్రమము తప్పక జరగెడి యుత్సవములు కొన్నియున్నవి. వైశాఖ శు ౭ మొదలుకొని పూర్ణిమ పర్యంతము చన్నకేశవ విగ్రహమునకు, వాహనోత్సవములు పదమూఁడు జరగును. ఇందు విజయ రథారోహణోత్సవ మొకటి. ఇది వైశాఖ శు ౧౩ న జరగును. ఆశ్వయుజ శు ౧౦ న (శమీపూజ) విహారోత్సవము - కార్తీక శు ౧౨ న తెప్పోత్సవమును-కార్తీక శు ౧౫ న కృత్తికోత్సవమును - పుష్య శు ౧౧ న ముక్కోటి గరుడవాహనారోహణోత్సవమును జరగును. ఇంతియగాక కామదహనమును మొహరమును గూడ ప్రతివత్సరమునను జరగును.

---

## ఏడవ యధ్యాయము.

---

### నీటి వసతి-నేలవసతి.

౧. నీటి గొట్టములు.— బహుకాలమునుండి యీగ్రామము కలరా వ్యాధికిఁ బుట్టినిల్లైయుండెను. చాలమట్టునకుఁ బ్రతివత్సరమును, గొన్నిసమయములయందు సంవత్సరములో రెండు పర్యాయములునుగూడ, నిది పొడచూపుట సహజమయి యుండెను. దొరతనమువారిది గమనించి, తఱచుగా నిట్లు కలరా వ్యాపించు చుండుటకుఁ గల కారణమును దెలిసికొనుటకయి 1913 వ సం॥ రమున, స్యానిటరీ కమీషనరుగారిని బంపిరి. వారిచ్చటికి వచ్చి, యిందలిజనులలో విశేషభాగ ముపయోగించునది తటాకజలమగుటచేత దానిని బరీక్షించి, పురజనులు వాడెడు చెఱువునీరు మిక్కిలి యనారోగ్యకరమయినదని వ్రాసిరి. తరువాత నిందలి యుచితవైద్యాలయమున నీవఱకే త్రవ్వింపఁ బడియుండిన చేదబావిలోని నీటిని, రసాయనశాస్త్రపద్ధతినిఁ బరీక్షించి, యందలినీరు ప్రశస్తమయిన దని నిర్ధరించి, దాని నింకను వృద్ధిచేసి యచ్చటనుండి నీటిగొట్టముల నేర్పఱుప నుద్దేశించిరి. 1914 వ సం॥ రమున

నిది నిశ్చయింపఁబడి, 1915 వ సం॥ రమున పని ప్రారంభమునొంది, ఫలరూపముఁ దాల్చినది. ఇందులకు 21000 రూపాయలు వ్యయ మయ్యె నని తెలియుచున్నది.

౨. సంఘములు.—ఇంతవఱకు నిచ్చట నాటకసమాజములు రెండును భజనమందిరములు మూఁడును తదితర సంఘములు నాల్గును నుండినవి. బహుసంవత్సరములుగా పేటయందొకటియు, కోటలో నొకటియు నాటక సమాజములు రెండు వేర్వేఱుగాఁ బనిచేయుచుండినను, సంఘీభావ బలము దుర్బలముగ నుంటచేత, నవి నడుమనడుమ చెదరి పోవుచుండినవి. కోటలోని నాటకసమాజ మొక సంస్కృతపాఠశాలను స్థాపించి, మూఁడు నాల్గు మాసముల కాలము మాత్రము నడపి, కొనకుఁ బాఠశాలతోఁ దాను సహిత మస్తమించెను.

3. దేవతారాధనసభ—ఇది కోటలోని భజనసమాజము. ఈసాంఘికులు శా॥శ ౧౮౩౪ వ పరీధావి నామ సం॥ర చైత్ర శు ౯ కి సరియయిన, 1912 వ సం॥ రము మార్చి నెల 27 వ తేది మొదలుకొని, ఏప్రలు నెల 5 వ తేది వఱకు, రామకోటి యుత్సవమును భూరిసంతర్పణలతో జరపిరి.

౪. భజనమందిరములు (పేట)—పేటలో రెండు భజనమందిరము లున్నవి. ఇందు ముఖ్య మయినది శ్రీరామమందిర భజనసభ. ఇది వైశ్యులకుఁ జెందినది. ఈసామాజికులు ప్రతి శనివారమును భజనతో గ్రామములోనికి వెళ్ళి బియ్యము ప్రోగుచేసి, దానిని సదావర్తుల కుపయోగించు చుందురు.

౫. అన్యోన్య సహకారసభ.—1907 వ సం॥రము జనవరి నెలలో నిది స్థాపింపఁ బడినది. ఇందలి సభికుల సంఖ్య 313. ఈసంఘమునుండి జనులకు రు 32402-12-0 ఋణములక్రింద నొసఁగఁ బడినది. ఇందు దొరతనమువారి పైకము వేయి రూపాయలును, సెంట్రలు బాంకు వారి ధనము వేయిరూపాయలును చేరి యున్నది. ఆదాయము 543 రూపాయలు.



౬. శ్రీక్రియాశక్తి యొడయరు సమాజము—1915 వ సం॥ రము డిశంబరు నెల 1 వ తేది పేటలో, వైసమాజము పేరఁ గొందఱు జనులు

౧ వ పటము.

శ్రీ క్రియాశక్తి యొడయరు సమాజము, పేట.



సంఘముగాఁజేరి యుపన్యసించుచు, కరపత్రములను చిన్నచిన్న గ్రంథములను ప్రచురించుచుఁ, పనిచేయుచుండిరి. ఈసమాజనామమునఁ బేటలో నొకచిన్న ని యాంధ్రపుస్తకభాండాగారము సహితము స్థాపింపఁబడినది. దీనిస్థిరప్రతిష్ఠకుఁ దగిన ప్రయత్నములు జరుగుచున్నవి

౭. సంఘసేవాసమితి—ఈసమాజచారిత్రము నిట సంగ్రహముగ వ్యక్తీకరించుట యుక్తమని తోఁచినందున, 1919 వ సం॥రము అక్టోబరు నెల

15 వ తేదీన జరగిన మహాజన సభా సందర్భమున్నందు, కార్యదర్శిగా రాంగ్లమునఁ జదివిన విపుల చరిత్రమునుండి, ముఖ్యభాగము మాత్రము సంక్షేపముగ నిందు సమకూర్పఁబడుచున్నది.

అ. ఉద్దేశము—ఉపకారగ్రాహులుగ నుండి కీర్తిశేషులయిన శ్రీమాన్ టి. ఎన్. వేంకటస్వామి నాయఁడుగారి కలన నిది, 1917 వ సం॥రము మార్చి నెల 30 వ తేదీన నెలకొల్పఁబడినది. ధర్మవర భాగము నందలి కేవల హీనజాతులను - నిమ్నులను, ఉన్నతదశకుఁ దెచ్చుటకయి, సర్వవిధములఁ బ్రయత్నించుటయే యీ సంఘోద్దేశము.

ఆ. అధ్యక్షులు—సంఘ సంస్థాపకులగు శ్రీమాన్ టి. ఎన్. వేంకటస్వామి నాయఁడుగారే, ప్రథమమున సంఘాధ్యక్షులుగా నుండి 1917-11-20 వఱకు విడువని పూనికతోఁ బాటు పడిరి. అనివార్యకారణాంతరములచే నాయఁడుగారిచ్చటినుండి మార్పఁ జెందు తరుణమున, దివాన్ బహదరు టి. రామరావుగారీస్థానము నలంకరించిరి. వీరు పనిచేసిన కాలపరిమితి, కొలఁది నెలలు మాత్రమే. అనంతరము 1918-2-14 న మ॥ రా॥ శ్రీ ఎస్. రాఘవేంద్ర రావుగారు కార్యభారము వహించిరి.

ఇ. కార్యదర్శులు—మ॥ రా॥ రా॥ శ్రీ ఎట్టిగుంట సంజీవరావుగారు పదునాఱు నెలలును, తరువాత శ్రీయుత ఎ. నారాయణస్వామి అయ్యరుగారు కొన్ని మాసములును, కార్యదర్శులుగ నుండిరి. ప్రకృతము ధర్మవరము తాలూకా తహశ్శీలుదారు మ॥ రా॥ రా॥ శ్రీ ఇ. ఎన్. వేంకట పెరుమాళ్ నాయఁడు గారీపదవి గయికొని, పాటుపడుచున్నారు. ఈసమితికి కార్యనిర్వాహక సంఘ మొకటి 1917-12-4 న ముగ్గురి సభ్యులచే నేర్పడినది.

ఈ. సభ్యులు—1917 వ సం॥రము సెప్టెంబరు మాసాంత్యముతోఁ గడచిన మొదటి యాఱు నెలలలో, పట్టీయందుండిన సభ్యుల సంఖ్య 24. సభ్యుల వలని యాదాయము రు 41-8-0. ఆరోగ్యవిషయముగ జరగినసభలు 3. 1919 వ సం॥రము జూలయి నెలచివరను, పట్టీలో నుండిన సభ్యులసంఖ్య 63. ఆదాయము రు. 348-14-0 లు. వ్యయము రు 72-0-2 లు. నిలువ రు 271-13-10 లు.



ఉ. విద్యావిషయము—సేవాసమితిమూలమున 1917-4-7 న మాదిగగూడెమునం దొకటియు, జూలయి 21 న పేటలో తొగటివారి కొకటియు, అక్టోబరు ౭-వ తేదీన కోటయందు గొల్లవారి యుపయోగార్థ మొకటియు, మొత్తమున మూఁడు రాత్రిపాఠశాలలు స్థాపింపబడెను. ఇందలి పంచముల రాత్రిపాఠశాల యాసంవత్సరముననే జూన్ నెలాంత్యమున, స్థానిక సంఘము వారి పాలనమునకుఁ జేర్పఁబడెను. పేటలోని బడి నిలిచిపోయినది. పంచములు తమ బాలకులకు సాంకేతికశిల్పకళ ముఖ్యమయి యున్నదనియు నట్టి విద్యయందు నిపుణుఁడయిన యుపాధ్యాయు నొక్కరుని నిందుల కేర్పఱచుట యవసరమనియు, సంఘమువారిని పాఠశాలా విచారణాధ్యక్షుని కోరియున్నారు.

ఊ. సేవ—రాత్రిపాఠశాలలను సందర్శించి, యందలి యుపాధ్యాయులతోఁ గలిసి, వారికి మంచి యోచనలు చెప్పి, కార్యసౌలభ్యమునకుఁ దోడుపడుటకయి, సంఘసభ్యులు పలుదెఱఁగులఁ బనిచేయుచున్నారు. వీరు పంచమవీథికిఁ బోయి, వారికి పరిమితత్వము వలని లాభమును త్రాగుడు వలని చెడుగులను దెలుపుచుఁ బాటుపడుచున్నారు. 1917 వ సంవత్సరము ఏప్రలు మాసారంభమున నిచ్చట కలరా విజృంభించిన సందర్భమున, సేవాసమితివారు గ్రామమును కొన్ని భాగములుగా నేర్పఱచి, ప్రతిభాగము నొకరిద్దఱి సభ్యులవశమున నుంచిరి. ఆ యంటువ్యాధిని నివారించుట యందుఁ, దమకుఁగల యుత్సాహమునంతయును వెలిపఱచుచు, స్వేచ్ఛాపూర్వకముగ సేవకసభ్యులు సల్పిన సేవావిధానము, వర్ణనాతీతము.

ఋ. శుభ్రత—ఈ సంఘస్థాపనమునకుఁ బూర్వము, మాదిగగూడెము మిక్కిలి యనారోగ్యదశయందుండెను. పంచమబాలురు వస్త్రవిహీనులయి మిక్కిలి యపరిశుభ్రముగ నుండిరి. సంఘాధ్యక్షు లగు శ్రీమాన్ టి. ఎన్. వేంకటస్వామినాయఁడుగారీ లోపమును దొలఁగించుటకయి పాఠశాలకుఁ బోయెడి బాలికా బాలకులకు, స్వంతవ్యయముమీఁద గుడ్డలను దీసియిచ్చిరి

పంచమ బీదబాలుర యుడుపులకయి, గడచిన (1919) జూలయి మాసమున యథోచిత విరాళముల నొసంగిన సోదరజనుల నామము లీ దిగువ నుదాహరింపఁబడుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| మ॥రా॥శ్రీ, | యాడికి లక్ష్మీనారాయణరావు | గారు రు. | 20-0-0 |
| ,, | జ్వాలాపురము రాఘవాచార్యులు | ,, | 10-0-0 |
| ,, | గోరకాటి చెన్నారెడ్డి | ,, | 14-0-0 |
| ,, | బి. చెన్నప్ప | ,, | 13-0-0 |
| ,, | సీరిపి ఆంజనేయులు | ,, | 12-0-0 |
| ,, | * మారనేని చిన్న వేంకటపతి | ,,(దాదాపు) | 125-0-0 |

ఈ విరాళ ధనములందు కొంతభాగము సంగ్రామ విజయ దినమున, గ్రామములోని యన్ని పాఠశాలల యందలి బీదవిద్యార్థుల యుడుపులకయి వినియోగింపఁబడెను. ఈ మొత్తమునం దింకను రు 36-6-3 నిలువయున్నది.

౭. జరుపఁబడఁగలసిన పనులు—పంచముల పురోభివృద్ధికై క్రింది విషయములలో సేవకసభ్యులు పాల్గొనుటకయి, సముచితముగ యోజింపఁబడినది. పంచమబాలురకును బాలికలకును భక్తి నీతివిషయముల గూర్చిన పాటలు నేర్పుట, కోలాటను పాటలతో జతపఱచుట, పురుషులలో పెద్దవారికి కోలాట నేర్పుట, అంగులకు వలయు పరికరములను సిద్ధపఱచుట, ఆఁడుపిల్లలకును పెద్దవారికిని గొబ్బి (చప్పట్లు చఱచుచు పాటలుపాడుచు నాడెడి యాట) నేర్పుట. గూడెమునందలి యిప్పటి పూరిగుడిసెల నొక్కొక్కటిగాఁ దీసివేయించి ఆరోగ్యపద్ధతిచొప్పున వీథుల నేర్పఱచి, క్రమ

* మ॥రా॥శ్రీ మారనేని చిన్న వేంకటపతిగారు సంగ్రామ విజయోత్సవ దినమున, నిరుపేదలకును కుంటి గ్రుడ్డి మున్నగు వికలాంగులకును దాదాపు మూఁడు వేల యనాథజనులకు సంతర్పణ చేయించెడి కార్యభారము వహించి, యట్టి సత్పాత్రదానవిషయమునఁ దమ యుదారగుణమును సార్థకము నొందించిరి.



క్రమముగా మిద్దెలఁ గట్టించుట, వీథులను పరిశుభ్రపఱచుటకుఁ గావలసిన యేర్పాటులను జేయుట, త్రాగుడును దొలఁగించుట, త్రాగనివారి కుత్సాహము గల్పించుట, వ్యాపారవిషయమునను చేతిపనుల యభివృద్ధికిని దగిన సలహాల నొసంగుట, సేద్యము చేయఁజాలిన యుత్సాహవంతుల కేరి వారికి భూముల నిప్పించుట, నైతికవిషయములయందు శ్రద్ధవహించుట, పగటిబడులను రాత్రిపాఠశాలలను సందర్శించుట.

౮. దివ్యజ్ఞానసభ—శ్రీమాన్ ఇ. ఎన్. వేంకట పెరుమాళ్ నాయఁడు వారి ప్రోత్సాహమున, నీ సభ ప్రతిభానువారమునను పఠనమందిరమున సమావేశమయి, గ్రంథావలోకన మొనరించును.

౯. ధర్మనిధి—ఇది 1919 వ సంవత్సరము ఆగస్టు నెల 8-వ తేదీన స్థాపింపఁబడినది. సాంఘికులమూలమున నెల నెలకును ధనము ప్రోఁగుచేసి, దాని నితరులకు వడ్డికిచ్చుటయు, రాఁబడిని ధర్మకార్యములకు వినియోగించుటయు, నీసంఘమువారి యభిమతమైయున్నది. ఇందలిసభికులు 65. భాగములు 159. సభికులవలని వచ్చుబడి రు 318-0-0 లు ప్రభుత్వశాసనము ననుసరించి, యిది యింకను రిజష్టరు చేయింపఁబడలేదు.

౧౦. ఆదిమాంధ్రులు—వీరిపాళెము 'పెద్దగూడెము చిన్నగూడెము మాలపాళెము' అను మూఁడు వేర్వేఱు భాగములు గలది. 1918 వ సంవత్సరము సెప్టంబరు మాసారంభమునకు పెద్దగూడెమున 85 ను, చిన్నగూడెమున 6ను, మాలపాళెమున 10 యు, మొత్తమున 101 నివాసగృహము లుండెను. వీరికి చరాస్తి రు 1900-0-0యును, స్థిరాస్తి రు 1870-0-0 లును, చేరి రు 3770ల స్థితి యుండెను. అప్పు రు 470 లు. చరాస్తిలో గొడ్డు గోదలు, వెండి బంగారునగలు, ఇంటిపరికరములు, నేతసామానులు చేరినవి. స్థిరాస్తిలో నిండ్లు పొలములు చేరినవి. జనులు సేద్యమువలనను నేత మొదలైన చేతిపనులవలనను జీవించుచున్నారు. కొందఱు వీధికసవు చిమ్ముట, వెట్టి, చదువు చెప్పుట, మొదలగు నుద్యోగముల నందియున్నారు. కూలిపని చేయువారిలో

నొక్కొక్కరు దినమునకు రెండు మొదలు పదియణాలవఱకును సంపాదింప శక్తిగలవా రున్నారు. ఇందొక బావియు, రెండు పాఠశాలలును, మూఁడు గుళ్లును ఉన్నవి. పాఠశాలలో నొకటి పెద్దవారికి రాత్రులయం దుపకరించునది. దీనిఁగూర్చి యీవఱకే తెల్పియుంటిమి. మఱియొకటి పగటిపాఠశాల. ఇదియు స్థానికసంఘమువారికిఁ జెందినదేను. దీనిఁగూర్చి వేఱుగ వర్ణించుట కంటెను ఇటీవల బళ్ళారి మూఁడవ సర్కిల్ యిన్స్పెక్టర్ దొరవారు సందర్శించి వ్రాసిన యంశముల నిచ్చట సూచించుట మాత్రము యుక్తమని తోఁచుచున్నది.

‘7-8-1919 నఁ దర్శింపఁబడినది. 60 మందికి వచ్చియున్నవారు 45 పాఠశాల వృద్ధిదశయందున్న దని వ్రాయుటకు సంతసించుచున్నాను. బాలురు విలక్షణముగను, పరిశుభ్రముగను నున్నారు. ఆరోగ్యపద్ధతి కనుకూలముగ బడికట్టడము నిర్మింపఁబడినది. మనోగణితమునను, భూగోళశాస్త్రమునను ప్రశ్నించిన యంశములకు, బాలురు తెలివిగల యుత్తరముల నిచ్చిరి. సుశిక్షితుఁడైన బడిపంతులు ప్రధానోపాధ్యాయపదవియం దుండెను. ధర్మవర సంఘసేవాసమితివారు, పంచముల నడుమ సల్పుచుండు నుత్తమ పరిశ్రమ విషయమునకయి, వారికి నేను నా సంతోషమును దెలియఁజేయు చున్నాను.—ఎ. రామారావు.’

(True copy) Visited on 7 — 8 — 1919. Attendence 45/60. I am glad to note that the School is in a progressive condition the children are neat and clean and the School Building has been maintained in a sanitary condition. The Children give intelligent answers to questions in mental arethmetic and geography. There is a trained head master in charge. I Congratulate the social service league of Dharmavaram on the excellent work it has done among these panchamas'.

7—8—1919. (Sd.) A, RAMA ROW,
Ag. Inspector III C.



## ఎనిమిదవ యధ్యాయము.

### ఉపద్రవములు.

౧ క్షామభయము—ఇప్పటికి రమారమి యెనుబది సం॥ముల క్రిందటి (శా॥ శ ౧౭౬౧వ వికారి నామసంవత్సరమునందలి) కఱవును గూర్చి కాఁపులు, నీ ప్రాంతవాసులు వృద్ధులు విరివిగఁ జెప్పుకొనెడివారు. ఇది యొక సంవత్సరకాల క్షామము. తినుబండములు లేక జనులును, గడ్డిగాదము లేక పశ్వాదులును, నాశనము నొందెను. ఇదియే యెత్తు గాలి కఱవని ప్రసిద్ధినొందినది. గాలియు వానయు విస్తార మగుటచే, వాని యురవడికి పక్షిజాలము విశేషముగ నశించెను. కడచిన యాఱువదిసంవత్సరములలోపల సంభవించిన కఱవు లెనిమిది. వానిపట్టీ యీదిగువఁ జూపఁబడుచున్నది.

| సంఖ్య | కఱవు సంభవించిన శా॥శక సంఖ్య. | | సంవత్సర నామము. | దానికి సరియైన క్రీస్తుశక సంఖ్య. |
|---|---|---|---|---|
| ౧ | శాలివాహన శకము | ౧౭౮౧ | రౌద్రి | 1859—60 |
| ౨ | ,, ,, | ౧౭౯౭ | ధాతు | 1875—76 |
| ౩ | ,, ,, | ౧౮౦౮ | వ్యయ | 1886—87 |
| ౪ | ,, ,, | ౧౮౧౩ | ఖర | 1891—92 |
| ౫ | ,, ,, | ౧౮౧౮ | దుర్ముఖి | 1896—97 |
| ౬ | ,, ,, | ౧౮౨౧ | వికారి | 18;9— 900 |
| ౭ | ,, ,, | ౧౮౩౩ | విరోధికృతు | 1911—12 |
| ౮ | ,, ,, | ౧౮౪౦ | కాళయుక్తి | 1918—19 |

పైన సూచించిన కఱవుల యెనిమిదింటిలోను గణన కెక్కినవి మూఁడు. ఇందు ధాతు సంవత్సర క్షామము తక్కిన వానికంటె నతిదారుణ

మయినదని తెలియుచున్నది. దీని యుఱవడి మూఁడేండ్ల వఱకు నుండినది. వికారి క్షామమునకంటె ధాతు సంవత్సరమునాఁటి కఱవు, బలీయ మైనదిగ నుండ నోపును. రెండు దినముల కొక పూఁట యయినఁ గడుపార నింత గంజి లభించుట దుస్తరము కాఁగా, బీద లనేకులు మలమల మాడిరఁట ! ఆఁకటి పెంపున కలబంద దుంపలను - చింత గింజలను - ఉడుకఁ బెట్టుకొని తిని పెక్కుండ్రు తమ యసువుల నిలుపుకొని రఁట! దేవదాయ సత్రము వేల కొలఁది జనుల ప్రాణరక్షణమునకుఁ గారణ మయ్యెనఁట ! అప్పు డినుప దారులు లేనందునను - తినుబండము లొక చోటినుండి మఱియొక స్థలమునకుఁ గొనిపోవుటకుఁ దగిన యానుకూల్యములు బొత్తిగా లేక పోవుట చేతను - ఇట్టి దారుణోపద్రవములకుఁ గారణ మయి యుండును. దొరతనము వా రా కాలమున చాలవఱకు జనుల కష్టములను గమనించి రని తెలియుచున్నది.

కాళయుక్తి నామ సంవత్సరము నందలి క్షామము కూడ, మిక్కిలి యుపద్రవకర మయిన దనియే తలంప వలసి యున్నది. దీని యుఱవడి సిద్ధార్థి సంవత్సరమునను హెచ్చి యుండెను. 1914 వ, సం॥రములోఁ బ్రారంభము నొందిన యైరోపా మహాయుద్ధము వలన, విదేశవస్తువుల దిగుమతి తగ్గిపోయెను. అచ్చటి మనసైనిక వర్గమునకు స్వదేశమందలి యాహార పదార్థము లెగుమతి చేయవలసి వచ్చెను. ఇందుచే నిచ్చటి ప్రతివస్తువును విలువయందు నాలుగయిదు రెట్లు హెచ్చెను. ఈ దేశమునుండి సామాన్య జనులు వేలకొలఁది కూలి పనుల కయి విదేశములకుఁ బంపఁబడుటచేతను, యువకు లనేకులు విషజ్వరమువలనఁ జనిపోవుటచేతను, వ్యవసాయ కార్యములు నడచుటకు వీలు లేక పోయెను. ఇందులకుఁ దోడుగా 1918 వ సం॥రమున, హిందూ దేశము నందంతటను నొకే విధముగా ననావృష్టి సంప్రాప్తమయ్యెను. పుట్లకొలఁది ధాన్యము నిలువ యుంచుకొనిన ధనికులు, తమ కొట్లనుండి వానిని వెలికిఁ దీయక దాఁచుకొనఁ జొచ్చిరి. కనుక రూపాయకు మూఁడు సేరుల వంతున నయిన బియ్యము



దొరకుట కష్ట మయ్యెను. బీదలకు జీవనము మిక్కిలి దుర్భరముగఁ దోఁచెను. ఇట్టి తరుణమున బర్మా దేశపు (రంగూను) బియ్యము, చాలవఱకు నిరుపేదలఁ గాపాడఁ గలిగెనని చెప్పవచ్చును.

౨ చోరభయము—ఈ ప్రదేశము సామంతరాజుల పాలనమునుండి తొలఁగి, బ్రిటీషు పాలకుల స్థిరభారము చక్కఁగా నెలకొనక దేశమును జయించుకొనిన యాంగ్ల వర్తకులు, పాలనాది సౌకర్యములఁగూర్చి బాగుగా యోచించుటకు వీలు గాక యుండిన సందర్భమున, దుండగీండ్రు 'ప్రాచీనరక్షకభటులను' లక్ష్యము సేయని యంత కాలము, నచ్చటచ్చట దోపిడికాండ్ర భీతి విస్తారముగా నుండెను; కాని క్రమక్రమముగా నిది తగ్గి సర్వవిధము లయిన సౌకర్యములు నెలకొనిన యనంతరము, బ్రిటీషు పాలనము జనుల సౌఖ్యమునకు మిక్కిలి కారణ మయ్యెను.

3. వ్యాధిభయము—ఈ గ్రామమున తఱుచుగా పొడచూపు చుండిన కలరా వ్యాధి, నీటి గొట్టముల పద్ధతి వాడుకకు వచ్చిన యనంతరము, కొంతవఱకు నివారింపఁబడిన దనుట వింత కాదు. ప్లేగు సహిత మొక్కొక సమయమునఁ దలచూపినను దానివలని ప్రమాదము తక్కువ. 1918 వ సం॥రము ప్రపంచమునం దంతటను వ్యాపించి యుండిన 'ఇన్ఫ్లూయంజా' యనఁబడు విషజ్వరము, ఇచ్చటను విజృంభించి, యువకులలోఁ బెక్కుండ్ర వినాశమునకుఁ గారణ మయ్యెను.

౪. కలహ భయము—శ్రీ నగరేశ్వరీ ఆలయ విషయమున ధర్మకర్తలలోఁ గొందఱకు వైషమ్యభావము కలుగుటచేత, వైశ్యులు పెద్ద గుంపువారనియుఁ జిన్నగుంపు వారనియు రెండు కక్షలుగాఁ జీలిపోయిరి. ఈ యిరుప్రక్కల వారిలోను మొలచిన విరస భావము, లోలోన విరోధమును హెచ్చించి, యిప్పటికి దాదాపు పది సంవత్సరములకుఁ బూర్వమే వాగ్వాదమునకును మల్ల యుద్ధములకును - మూల మయి యుండెను. ఇందువలన నంగళ్ళ వాడలో తేరువీథిని, 1917వ సంవత్సరము మార్చి నెల 24, 25, 26 తేదీలలో

నొక నాఁటి రాత్రియంతయు, వీరికి రాళ్ళపోరాటము తటస్థించియుండెననియు, మఱునాఁ డనంతపురము నుండి వచ్చిన రిజర్వు పోలీసు సహాయమువలన, నా యలజడినివారింపఁబడెననియుఁ జెన్నపురిలోనుండఁగా మాకుఁ దెలియవచ్చెను. ఇట్లిరువైపుల వారును పెక్కు విషయములలోఁ బోట్లాడి, న్యాయస్థలముల కెక్కి, చింత గింజలవలె రూపాయలఁ జిందివైచిరి. ఇందువలన వీరి యార్థిక మానసిక శక్తులు దుర్బలము లగుటయె గాక, గ్రామ రక్షకును - గ్రమ క్షకును - గొంతవఱకుఁ జలనము పొడచూపినది. గ్రామములోని తగ్గు జాతులవారిలోఁ గొంద ఱిది కారణముగాఁ గక్షులలోఁ జేరి, నాయకులను మఱింత ప్రేరేచి, వారినుండి డబ్బులాగుకొని, విరివిగఁ ద్రాగి, స్వేచ్ఛగా నల్లరులు చేయఁదొడఁగిరి. చివర కీ కలహమువలనఁ గలిగిన ఫలము, తగ్గుజాతులలో త్రాగుడు వృద్ధి నొందుటయే.

ఈ గ్రామము పెనుగొండ మండల భాగమునకుఁ జెందియుండిన సందర్భమున 1885 వ సంవత్సరము, మొహరమును విజయదశమియు నొకే పర్యాయము తటస్థించి యుండెను. ఆ సమయమున మేళ తాళములఁ గూర్చియు-ఉత్సవాదుల గుఱించియు - హిందూ మహమ్మదీయులకు గొప్ప కలహము సంభవించెను; కాని యప్పుడు క్రొత్త పద్ధతు లేవియు నేర్పడక, ప్రాచీన ధర్మముల చొప్పుననే కార్యసంవిధానము నడచినది. 1898 వ సం॥రము మే, నెలయందును, రథోత్సవము మొహరము నొకే పర్యాయము తటస్థించెను. అప్పుడు సహితము హిందూ మహమ్మదీయులు చెలరేఁగియుండిరి. అట్టి తరుణమున పెనుగొండ హెడ్ అసిస్టాంటు కలెక్టరు, పీర్ల పండుగ యుండినను హిందువులు మ యుత్సవముల జరపుకొనవచ్చునని తీర్మానించి, తాను తన పరివారముతో నిచ్చటనే యుండి, వానిని సక్రమముగ నడపినట్లు తెలియుచున్నది. 1917 వ సంవత్సరమునఁ గూడ నిట్టి విషయమయిన పోరాటమే పుట్టెను.

"హిందువులు మహమ్మదీయ దేవతలయెదుట మేళ తాళములతో వెళ్ళగూడదు. భజనలు చేయరాదు. ఉత్సవములు జరుపకూడదు. ఈ పనులు



మా దేవతలకును - ప్రార్థనలకును - మిక్కిలి యడ్డంకిగా నున్నవి" అను నది మహమ్మదీయుల వాదము.

"భజనమందిరములు బజారులోనే యున్నవి. మందిరములలోఁ గూరుచుండి భజన చేయుటయే బహుకాలమునుండి వాడుకగానున్నది. ఇప్పు డీ కారణమున నట్టి వాడుకను మానుపఁజాలము. ఇంతియుగాక భజన మందిరములు పీర్లచావడుల కెదురుగాఁగాని, మహమ్మదీయ ప్రార్థనాలయముల కు సమీపమునఁగాని లేవు. కనుక మాభజన మహమ్మదీయుల కెంత మాత్రము నాటంకముగా నుండ నేరదు. అవసరములగు శుభకార్యములను - ఉత్సవములను - జేయక తీఱదు. మా యుత్సవములఁ జూచుట వారిదేవతల కవమానముగా నుండెనేని, యా సమయమున మహమ్మదీయులు వారి చావడులలోఁ గొంతసేపు తెర కట్టుకొనుట, సులభము." ఇది హిందువుల వాదము.

ఇట్టి సందర్భముననే మండలాధిపతిగా నుండిన మహమ్మదీయ సోదరుఁడు, మొహరము దినములయందు మహమ్మదీయ చావడుల కేఁబది గజముల దూరములో, హిందువులు భాజా భజన్త్రీలు ప్రయోగించ కూడ దని యుత్తరువు చేసినట్లు, గ్రామమునందు వదంతి పుట్టెను. మహమ్మదీయు లింకను చెలరేఁగిరి. ఈ గ్రామమున ముఖ్య వీథియం దేఁబదిగజముల కొకటి వంతునఁ బొడవునను మసీదులుండుటచే, నిది హిందువుల యుత్సవములకు మిక్కిలి భంగకారణముగా నున్న దనియు, హిందువు లనుకొనఁజొచ్చిరి.

క్రమక్రమముగ నీ పోరాటము హెచ్చి, యిరుకక్షుల వారిలోను విస్తారమగు నుద్రేకము కలుగఁజేసెను. మహమ్మదీయులకుఁ గుండల నీయమని కుమ్మరులును - క్షౌరము చేయుమని క్షౌరకులును - వెచ్చముల నీయమని కోమటులును - బట్ట లుతుకుటలేదని చాకలి వాండ్రును - ఎదురు తిరిగిరి. ఈ కలవరము నాపుటకయి యధికారు లందఱును ప్రయత్నించిరి. ఇట్టి సందర్భమున దుర్గాష్టమి నాఁ డొక హిందూసోదరుఁడు, గొఱ్ఱెపోతు నొకటిని దుర్గకు బలిచేసి, యాళవమును బట్టించుకొనిపోయెను. ఇది

చూచి మహమ్మదీయసోదరులు తమ దేవళమునకు మిక్కిలి యవమానము కలిగిన దని గోలపెట్టుచు, చావళ్ళు మూయించి వేడుకల నాపిరి. ఇట్టి యల్లరులచేత పదిదినములును, మిక్కిలి యాందోళన పూరితములుగ నుండెను.

మహమ్మదీయ మసీదు నొద్ద హిందువులును, హిందూదేవాలయముల యెదుట మహమ్మదీయులును, మేళ తాళములతో వెళ్ళకుండుట యుక్తమనియు - నట్లు జరగించవలయు ననియు - మహమ్మదీయులు మండల న్యాయాధిపతికి విన్నపము చేసికొనిరి. అది 1918 వ, సం॥రమున విచారణ జరగినది. 1919 వ సం॥రము జనవరి నెల 10 వ తేదీన మండల న్యాయాధ్యక్షుఁడు క్రింది * యుత్తరువు నొసంగెను. 'హిందువుల మత-లౌకిక సంబంధములగు నుత్సవములు, మసీదు ముందఱ ప్రాచీన కాలము నుండియు సర్వవేళల వాద్య సహితముగా వెళ్ళుచుండె నను విషయము, ధర్మవరవాసు లగు మహమ్మదీయు లామోదించుచున్నారు. ఈ పురాతనపద్ధతికే గౌరవ మీయవలసి యున్నందున, మహమ్మదీయుల మనవి యనుసరింపఁబడఁజాలదు.'

From M. R. Ry.
Rao Bahadur T. Raghavaih Pantulu Garu, B.A,

The Dharmavaram Muhammadans admit that all Hindu procission, whether religions or lay, have been passing by the Mosque with Music at all hours from time immemorial. This immemorial Custom must be respected. The request of the Muhammadan's petition connct therefore be complied with.

(Sd.) H. E. L. D. SENA,
for District Magestrate.

౫. ఊరజాతర—ఇది "గ్రామజాతర" యనఁబడెడి యొకానొక క్రూరమయిన వేడుక. సర్వసాధారణముగా నీగ్రామములయం దంతటను వలె నీపురమునఁ గూడ విషమ సంఖ్యగల సంవత్సరములలో నిది యొక దినము మాత్రము జరగును. నాగరకత దేశీయులతోడి సంపర్కము హెచ్చు



టచేత, జనులలో యుక్తాయుక్త వివేచన పరిజ్ఞానము నెలకొనుట కానుకూల్య మయిన యీకాలమునఁ గూడ, నిట్టి యపవిత్రకార్యములు రూపుమాయకుండుట చిత్రమె. అల్పమై - నిర్జీవమై - మనుష్యకల్పితమైన యొక మట్టిబొమ్మ యెదుట, మానవుఁ డమూల్యమై - నిరపాయకరమై - దైవకృతమైన తోడి జీవ సంతతిని మిగుల లాఘవముగఁ జీల్చి, నెత్తుటి వఱదలఁ గల్పించుటయందుఁ గూడ, మంచి తెలివి గర్భితమయి యున్నదని భావించువారు కొందఱు. పామరుల మూఢ విశ్వాస మిట్లుండఁగా నున్నత వర్గమునకుఁ జెందిన సోదరులు సహిత మీ నీచకర్మలకుఁ బ్రోత్సాహమిచ్చుచుఁ దాము నిట్టి విషయములలోఁ బాల్గొనుచుండుట చాల విచారకరము.

1919 వ సం॥రము జనవరి నెల 7వ తేది మంగళవారమున నీ గ్రామమునం దీజాతర జరుపవలసినట్లు జనులు సంకల్పించుకొనుచుండిరి. అది చూచి తెలివిపరు లొకరిద్దఱు తమకు చనువున్నవారితో, నిట్టి భయంకర మయిన పండుగల నిఁక ముందు చాలించుట యవసరమనియు, నీపనులు హిందూమత మహాగౌరవమునకును నీతికిని మిక్కిలి హీనముగా నున్నవనియు, విన్నవించుకొనిరి. ఆమాటల నెవరు వినిరి? తాత తండ్రుల కాలమునుండి వచ్చుచుండెడి యీవాడుకను వదలకూడ దని యున్నత వర్గమునకుఁ జెందిన పురుషులు సెలవిచ్చిరి. ఇంటికిని పంటకును పెంపుగూర్చెడి యీ మహాపర్వ మవశ్యముగ జరుపఁబడ వలెనని తరువాతివారు శాసించిరి. లోలోన గ్రామాధికారి ప్రబలప్రయత్నము సలుపుచుండెను. దీని కడ్డుపడు వారిని మిక్కిలి నీచముగ నవమానించెదమని ప్రముఖులు బీరము లాడఁజొచ్చిరి. జాతర జరుగనిచో పంటలే పండవనియు గ్రామము తప్పక నాశనము నొందుననియు దక్కినవారు భ్రమించిరి. ఇట్లు గ్రామమంతయు నొక్కపలుకుగా నుత్సవము చేసితీరవలయు ననుచుండగా, నిది కూడదను వారిమాట లెవరి చెవిని దూరగలవు? వారి హితబోధ యెవరి మనస్సున కెక్కఁగలదు?

గ్రామమున వ్యాప్తి నొందుచుండిన ప్లేగు బాధ్య మప్పుడప్పుడే యుపశమించుచుండెను. చుట్టుప్రక్కల గల పల్లెలయందు కలరా మొలకెత్తుచుండెను. కనుక నిట్టియెడ జాతర జరపుట సమంజసము కాదని యొకరిద్దఱు 1918-12-21 వ తేదిని మండలాధిపతిగారికి నుపమండలాధిపతిగారికి, క్రింది యంశములు గల విజ్ఞప్తిని బంపిరి.

ధర్మవరమునఁ గోటలో మహామారి యున్నదనుటకుఁ దార్కాణముగా నెలుకలు పడుచుండుటయె గాక, గడ్డలుకట్టి జ్వరముతగిలి జనులు సహితము చనిపోవుచున్నారు. ఇది యిట్లుండగా మాయూరివారు కొందఱు రాగల జనవరినెల మొదటివారమున నూర జాతరచేయుటకై నిశ్చయించుకొని యున్నారు. ఇది మిక్కిలి కూడనిపని. ఈ జాతరకాలమున గ్రామవాసుల బంధువులు పెక్కుచోట్లనుండి వచ్చి మిక్కుటముగ నిచ్చటఁ జేరుటయు—గొఱ్ఱెలు, కోళ్లు, పొట్టేళ్లు, పోతులు, విరివిగ హత్యగావింపఁ బడుటయుఁ దటస్థించును. పోతరాజని పిలువఁబడు మనుష్యుఁ డొకఁడు, ప్రత్యక్షరాక్షసునివలె నొక పోఁకను బలవంతముగఁ గఱచి, దాని కండరములను భయంకరముగఁ బెఱికి చిత్రవధ గావించును. నెత్తురుపాఱి నేల తడిసిపోవుటవలనను, తదితర కళ్మలపదార్థములు నీళ్లలో కడుగుటచేతను, మిక్కిలి జుగుప్సాకరమై గాలియు నీళ్లును విస్తారముగఁ జెడి, మితిమీఱిన యనారోగ్యమునకుఁ గారణ మగును. జాతరసమయమున నాసాదివాండ్రు వినఁదగని మాటలు వెలువఱచుటచేతను బూతుపాటలు పాడుటచేతను చూచినవారి నెల్ల తిట్టుటచేతను నీతికి మిక్కిలి విరుద్ధ మగును. మాదిగవాఁడంగములతో ననఁగా దిగంబరత్వమున ముఖ్యవీథులలో బహిరంగముగ నూరేఁగుటయు, నోటికివచ్చినరీతి బండబూతులు తిట్టుటయు, స్వహస్తమున మూత్రము కార్చుకొని వేడుకఁజూచెడు స్త్రీపురుషులమీఁదఁ జల్లుచు పోవుటయు, మిగుల లజ్జాకరము. నీతి కిది చాల విరుద్ధమగుటయగాక, జనులు మృతజంతువుల ఎముకలను మలాదికములను నిండ్లప్రక్కలోను జలాశయములయందును దిగవిడుచుకతన నీళ్లు చెడిపోవుట, శవమాంసఖండముల నారఁబెట్టుచుండుటచే వాని నుండి కొన్నివారములు దుర్గంధము వెలువడుచుండుట, ప్రకృతవ్యాధి వృద్ధినొందుటకుఁ గారణము మాత్రమే గాక - కలరాజాడ్యమును క్రొత్తగాఁబుట్టి, వానిపురుగులు వేఁడుక చూడవచ్చిన జనులవలన విత్తనపు గంపలవలె పలుచోట్లకుఁ గొనిపోబడుటయు పోయినచోట్లలోనెల్ల రోగములు నెలకొని వేలకొలఁది ప్రాణనష్టములకుఁ గారణము లగుటయు సందర్భించును; కావున దయావంతులును జనకసదృశులును నగు తమకు నివేదించుకొనుచున్నారము. అవి నీతికరమైనట్టియు, హేయకరమైనట్టియు, నవమానకరమైనట్టియు, చాల



నీచకరమైనట్టియు, మిక్కిలి హింసాకరమైనట్టియు, ముఖ్యముగా ననారోగ్యకరమైనట్టియు, నీ క్రూరకార్యమును జరుపక వదలిపెట్టునట్లు వెంటనే యాజ్ఞాపింపఁ దమ మహాకృపను మిక్కిలి యర్థించుచున్నారము.

ఈ విన్నప మందుటకుఁ బూర్వమే మీఁది యుద్యోగీయు లిద్దఱును సెలవుమీఁద వెళ్లి యుండి, జనవరినెల 3-4 తేదీలవఱకును రాఁజాలక పోయిరి; కావున నిందు విషయమై తీవ్రచర్య జరుపఁబడవలసిన కాలము తప్పిపోయెను. ఈలోపల గ్రామాధికారి జాతర జరుప నిశ్చయించితి మని చాటెను. ఊరివా రత్యంతకుతూహలముతో పదార్థములను సిద్ధపఱచుకొని బందుగులను రప్పించుకొనిరి. జనవరినెల 4-5 తేదీలలో, సహాయ మండల దండ విధాయి యీవిషయమై చర్య జరపి, జాతర నిలుపవలసిన దని యుత్తరువు చేసెను. తరువాత బ్రాహ్మణేతరవర్గము నందలి పెద్దలందఱును మండల దండ విధాయి యొద్దకుఁ బోయి, పలుదెఱఁగుల మొఱ్ఱపెట్టుకొనిరి. ఉత్సవ దినము మఱునాఁడే యగుటయు, ఇందుల కయి పెక్కుచోట్లనుండి జనులు విరివిగ వచ్చి చేరియుండుటయుఁ దెలిసి, మండల దండ విధాయి విధిలేక యుత్తరు విచ్చినను, జాతరయందు పెక్కు మార్పులను మాత్రము చేయకపోలేదు. పెద్దల కీ యుత్తరువు తృప్తికరముగ లేక పోయినను, పంతము నిగ్గిన దను సంతోషము మాత్ర కలుగక పోలేదు.

జాతర సమయమున జనులు విచ్చలవిడిగ వెచ్చపెట్టిరి. పాపము నోరెఱుఁగని సాధుజంతువులపై వారు తమ పంతముఁ దీర్చికొనిరి. వారు లీ ప్రయత్నమున నిమగ్నులై యుండుటచేత పొలములకుఁ బంట లెక్కింపవలసిన తఱి మీఱిపోయెను. చాయ పోయినను విత్తిక తీరలేదు. అందుమీఁద నకాలవర్షము. పైరులకు నక్కతెవులు. పొలముమీఁద గింజలు లేకపోయినను కసవు మాత్రము మిగిలెను. ఉన్నదంతయు నూరిజాతరలో వెచ్చపెట్టుకొనిన పేదలు పంటల కెదురు చూచుట సహజమేకదా? ముందే కూడు గుడ్డలకుఁ గఱవు. అందులో పంటలు పాడు. ఈ కారణములవలన జనులు మఱింత నలిగిపోయిరి. ఊరిజాతర విషయమై తేలిన పరమార్థ మిదియే.

## తొమ్మిదవ యధ్యాయము.

---

### రాజ్యాంగము.

౧. కార్య స్థానములు.—ఇచ్చట పుర పారిశుద్ధ్య కార్య స్థానము, ఉచిత వైద్యశాల, లేఖావాహన కార్యస్థానము, గ్రామాధికారుల కార్య స్థానము, రక్షకభటుల నిలయము, విద్యావిచారణాధికారి కార్యస్థానము, శాఖోపమండల కార్యస్థానము, ఉపమండల కార్యస్థానము, ఉత్తమ న్యాయస్థానము (Magtstrate Office), ప్రత్యేక ప్రథమ · వర్గ న్యాయ స్థానము (Special first class magtstrate office) ఉన్నవి.

౨. పురపారిశుద్ధ్యసంఘము.—ఇది 1880 వ సంవత్సరమున స్థాపింపఁబడినది. 1882 వ ఏఁట నుండిన నివాసగృహముల సంఖ్య 1870. నాఁటి యాదాయము 810 రూ॥ లు. ఇంతవఱకు సభ్యులుగా నుండినవారిరువదిమందిఇం దధికార వర్గమునకుఁ జెందినవారు పదునలువురు. అనధికారు లార్వురు నేఁటి (1919 వ సం॥రము) నివాసగృహముల సంఖ్య 2158. రాబడి 8740 రూ॥లు. గృహముల సంఖ్య వృద్ధియైనది. అధ్యక్షు లెందఱో మాఱిరి. పన్నులు సహిత మినుమడించినవి. ఆదాయవృద్ధికి లేశమైనను గొఱంతలేదు. ఇన్ని యభివృద్ధు లుండియు, గ్రామ పారిశుద్ధ్య విషయ మొక్కటి మాత్రము, మిక్కిలి హీన దశయం దుండుట చాల సంతాపకరము.

ఇందలి రాబడియంతయు జలయంత్రాభివృద్ధికే సరిపోవునని సంఘమువా రనుచున్నారు. రెండువేలకుఁ బైని గృహసంఖ్యయు, రమారమి ఎనిమిదివేల జనసంఖ్యయుఁ గల, ఈ గ్రామమునకు పది పదునైదు నీటిగొట్టము లుండినంత మాత్రమునఁ జాలదు. ఈ గొట్టముల సంఖ్య వృద్ధిచేయు విషయమును గూర్చియు - గ్రామపారిశుద్ధ్య విషయమును గుఱించియు - సంఘమువారును స్థానిక ప్రభుత్వమువారును యోజించి, చక్కని యేర్పాటుల నొనరించుట యవసరము.



౩. గ్రామాధికారులు.—గ్రామ నిర్మాణ కాలము నాఁటి గ్రామాధికారులు పోకనాఁటి ఓబిరెడ్డి కుమారుఁడు నాగిరెడ్డిగారును మాదనపల్లె



౯ వ పటము:—శాఖోపమండల కార్యస్థానమును ధర్మవరగ్రామమును.

కొడిద కాపు నాగిరెడ్డి కుమారుఁడు కృష్ణారెడ్డిగారును. నేఁటికి ముప్పది సంవత్సరముల క్రిందటివఱకు నీ వంశీయులే ధర్మవర గ్రామాధికారులుగా నుండిరి. ఇప్పటి గ్రామాధికారి దేశాయి శ్యామరావుగారు.

ర. శాఖోపమండల కార్యస్థానము.—ధర్మవర మను పేరుగలశాఖోప మండలమున (తాలూకా)కు బహుకాలమునుండి ముఖ్యపట్టణముగా నున్నది. వెనుకటి దినములలో నీ గ్రామమున నుండిన కార్యస్థానము నేలసమమయి నది. ఇటీవల నిది యీ యూరికిఁ బశ్చిమభాగమునఁ గట్టఁబడినది. ఈకట్టడ మిందలి తొమ్మిదవ పటమునఁ జూపఁబడినది. దానిముందుఁ జెట్లుమఱుగునఁ గొలఁదిగఁ గానిపించెడు భాగమే ధర్మవరగ్రామము. ప్రకృత మిందలితహ శ్శీలుదారు ఇ. ఎన్. వేంకట పెరుమాళ్ నాయఁడుగారు. వీ రిదివఱకే పదు నైదు సంవత్సరముల క్రిందట నిచ్చట, జనహితకారు లయి కృషి సల్పి యుండిరి. దీనులయెడ కరుణ వీరికి భూషణప్రాయము. నిమ్నజాత్యుద్ధరణ విషయమున వీరికిఁ గల పట్టుదల నిరుపమానము.

ల. ఉపమండల కార్యస్థానము.— 1910 వ సం॥ రమున ధర్మవర మొక యుపమండలముగా నేర్పఱుపఁబడినది. ఆ సంవత్సరముననే అక్టోబరు నెలయం దిచ్చట నొక యుపమండల కార్యస్థానము నెలకొల్పఁబడినది.

(క) టి. సుబ్బరాయలయ్యగారు

**1910 వ సం॥ రము మొదలుకొని 1914 వఱకు.**

వీరి వాసస్థానము చెన్నపురి. ధర్మవరమునకు వచ్చిన మొట్ట మొదటి యుపకరగ్రాహులు వీరే. 1910 వ సం॥రము అక్టోబరునెల 1 వ తేదీన వీ రీపదవి నలంకరించిరి. ధర్మవరోపమండల విభాగ ప్రారంభ సమయమున కదిరి తాలూకాయందు బందిపోటు నేరములును, గొప్పగొప్ప కన్నపు దొంగ తనములును నరహత్యలును మిక్కుటముగ జరగుచుండినవి. దొంగసొత్తులను కొని యనేకులు దొంగతనములకు మిక్కిలి యాస్పద మిచ్చుటయు తటస్థించి యుండినది. అట్టి యపచారములఁ దొలఁగించుటకయి వీరు మిక్కిలి పరిశ్ర మించి, దుండగులకుఁ దగిన శిక్ష విధించిరి. దొంగతనమే ముఖ్యజీవికగాఁ గల దుర్మార్గులు పెక్కుం్రు, వీరి విచక్షణబుద్ధి వలన, నీమండల భాగము నుండి పరారి చిత్తగించుటయు సంభవించినది. వీరికాలముననే 1913 వ



సం॥రమున నీటి గొట్టముల విషయమయిన ప్రస్తావమున కాస్పదము గలిగినది. కాలిలో కురుపు లేచి అనంతపురమున 1914 వ సం॥ రమున వీరు గతించిరి.

(చ) టి. ఎన్. వేంకటస్వామి నాయఁడుగారు.



౧౦ వ పటము.

కీర్తిశేషులయిన టి. ఎన్. వేంకటస్వామి నాయఁడుగారు

**క్రీ. శ. 1914 మొదలుకొని 1917 వఱకు.**

వీరి వాసస్థానము తంజావూరు. 1914 వ, సం॥రము నవంబరు నెల యందు వీ రీపనిలోఁ బ్రవేశించిరి. నీటిగొట్టముల విషయము పూర్తిగాఁ బ్రకం

నకువచ్చి, వీరికాలముననే నిశ్చయింపఁబడి, ఫలరూపము దాల్చెను. మితభాషణము-దీనజనులయం దుత్తమకరుణ-నిష్పక్షపాతబుద్ధి-న్యాయధీరత మున్నగునవి, నాయఁడుగారి సహజగుణము లయి యుండెను. పౌరులలో కొందఱు కక్షలు పూని చిన్నచిన్న పోరాటములు సలుపుచు, సంతటితోఁ దనియక ఘాతుకకృత్యములకు సహితము పూని, యందులకుఁ దగిన సాహసవంతు లిచట లేనందున, నట్టివారి నితరస్థలములనుండి రప్పింపఁ జొచ్చిరి. ఆసందర్భమున శ్రీ వేంకటస్వామి నాయఁడుగారు, కక్షిదారులలోఁ బ్రముఖుల నుండి పూచీలఁ దీసికొనియుఁ, దగినశిక్షల విధించియుఁ, గలహాంకురముల రూపుమాపిరి. వీ రిచ్చట సంఘసేవాసమితిని స్థాపించి, యందుమూలమున మిక్కిలి పాటుపడి, దిక్కుమాలి తిరుగు చుండిన దీనజనులను బైకిఁ దెచ్చుయత్నముల, విరివిగ నాచరణరూపమునఁ జూపిరి. కలరా మున్నగు వ్యాధు లిచ్చట ప్రబలియున్న తఱి, దిట్టతనమున వాని నెదుర్కొని జనులకు నాయఁడుగారు సల్పిన సేవ, యెప్పటికిని మఱవఁ దగనిది. అన్నివేళల జనహితమునే కోరుచు, నందులకు వీరు సర్వవిధములఁ గృషి సల్పిరి. వీ రిచటినుండి మార్పు జెందిన సమయమున, పురవాసు లందఱును వీరి కృతజ్ఞతను మిక్కిలి స్మరించి, వీరి యెడఁబాటునకయి చాల వగచిరి. కడపమండలమునందలి రాజంపేట యందు, విషజ్వరమువలన 1918 వ సం॥ రమున వీరు కీర్తిశేషు లయిరి.

### (ట) ఎస్. రాఘవేంద్రరావుగారు.

### క్రీ. శ. 1917 వ. మొదలుకొని 1919 వఱకు.

వీరి స్థలము కడలూరు. 1917 వ సం॥రము నవంబరునెల 22వ తేదీని వీ రీపదవిని స్వీకరించిరి. ఇచ్చటి స్థానికపాఠశాల నుచ్ఛస్థితికిఁ దెచ్చుటకు, వీ రెక్కువ శ్రద్ధ పూని యుండిరి. ఆహారపదార్థముల వెలలు వృద్ధియై బీద సాదలకు జీవికయే దుర్భరము కాఁగా, ధర్మవర మండల భాగమునం దందందు (1918 వ యేట) లూటీలు జరపు ప్రయత్నములు ప్రబలఁ జొచ్చెను. అట్టి తఱి వీరు బీదల యాఁకలి నాపుటకుఁ దగిన రీతినిఁ బాటుపడిరి,



### (త) సి. చలపతి పంతులు గారు.

### క్రీ. శ. 1919 వ సం॥ రము.

ఎస్. రాఘవేంద్రరావుగా రిచ్చటినుండి యనంతపురమునకు మార్పు జెందు తరుణమున, 1919 వ సం॥ రము అక్టోబరు నెల 18 వ తేదీన వీరు పనిలోఁ బ్రవేశించిరి. ప్రకృతము నిమ్న జాతి సంఘ సేవాసమితి కధ్యక్షులుగ నుండి పాటుపడుచున్నారు. ఆంధ్రు లగుటచేఁ దెనుఁగున వీరికిఁ జక్కని పాండితి గలదు: సంస్కృతమున సహితము కొంతవఱకుఁ గృషి సల్పియున్నారు; మఱియు వీరు వేదాంత విచార తత్పరులు కూడను.

౬ ఉత్తమ న్యాయస్థానము—ఇది ప్రత్యేక ప్రథమవర్గ న్యాయస్థానముతోఁ గూడ 1915 వ సం॥రము జూలయి నెలయందు సంస్థాపింపఁబడినది. అనంతపురము- బళ్ళారి- కడప- చిత్తూరు- మున్నగుచోట్ల నుపకారాగ్రాహులుగా నుండి, మొక్కవోని ధైర్యముతోను స్థిరవిశ్వాసముతోడను బని చేసి సత్కీర్తి గడించి, ప్రకృతము విశ్రాంతివేతనము నందికొనుచుండు ధర్మవరవాస్తవ్యు లగు దివాను బహదూరు టి. రామారావుగారు, ప్రత్యేక ప్రథమవర్గ దండవిధాయి (Special first class magestrate) గాను, ఉత్తమ దండవిధాయి (Bench Magtstrate) గాను, పని చేయుచున్నారు. న్యాయవిచక్షణయందు వీరికిఁగల సూక్ష్మగుణ మనుపమానమైనది. స్వధర్మమును నెఱవేర్చుటలో వీరు పరుల పొగడికలనుగాని తెగడికలనుగాని యెంతమాత్రమును సరకుసేయని ధీరులు. నిగర్వము వీరి గుణరత్నములలో నొకటి. ఒకానొక యాధునికకవి వీరిని గూర్చి యిట్లు నుడివియున్నాఁడు.

సీ॥ "ధర్మవరంబునఁ దనరు జనంబులఁ । గార్యకౌశలమునఁ గడఁకఁ గూర్చు
వృత్తుల వారిని విద్యాధికులతోడఁ । జేరుచు యత్నముల్ సేయఁబూను
నిమ్నజాతులవారు నెఱి నొందఁగా । బోధ సలుపును సద్గుణసమత గలసి
న్యాయధీరతఁబూని న్యాయపాలనమునఁ । బురజనముల కెల్లఁ బ్రోదిసెట్టు



౧౧ వ పటము.
శ్రీమానుమలూరు జి. రామరాయ్యగారు

తే॥ గీ॥ నట్టి తుంపర్తి రామరా యార్యవరుఁడు
వితరణాఢ్యత విఖ్యాతి వెలయఁ గాంచి
రాజ్యతంత్రంబుల నెఱింగి పూజ్యుఁ డగుచు
వెలసె-వెలయుచు నున్నాఁడు-వెలయఁగలఁడు.



# పదియవ యధ్యాయము.

---

## ప్రసిద్ధపురుషులు.

౧ కోడెకోండ్ల పెద్దయాచార్యులుగారు — వీరు శ్రీవైష్ణవబ్రాహ్మణులు. వీరి పుట్టుక పేరు శ్రీనివాసాచార్యులు. సంస్కృతమున గొప్పపండితులు. ఇప్పటికి దాదాపు 150 సంవత్సరముల క్రిందట, కడప న్యాయస్థానమునఁ బ్రధానలేఖకులుగా నుండి, సత్కీర్తి నందినవారు. వీరి తమ్ములు చిన్నయాచార్యులు. భరతశాస్త్రకోవిదులు. ఈ వంశస్థు లిప్పటికి నున్నారు.

౨ వైద్యము కృష్ణమాచార్యులుగారు—వీరును శ్రీవైష్ణవ[illegible]కుఁ జెందినవారే. సంస్కృతవిద్వాంసులు. ఆయుర్వేదవైద్యమున సహితము వీరి కెక్కువ యనుభవ ముండెను. వీరితమ్ములు దీక్షాచార్యులు: నాడీజ్ఞానమునం దసమానులు. గోసంరక్షణము వీరి ముఖ్యదీక్షగా నుండినది. ఈ సోదరులకు సంతతి లేకపోవుటచేత పెద్దవారగు కృష్ణమాచార్యులు, తాడిపత్రి తాలూకా జూటూరి యగ్రహారమున నుత్కలమువారి రింటినుండి, తమ పేరిటి బాలకుని దత్తునకుఁ దెచ్చుకొనిరి. దత్తపుత్రు లగు రెండవ కృష్ణమాచార్యులు చక్కనివిద్యాబుద్ధులఁ గఱచి,యుక్తవయసున సువివాహితులైరి. వీరికి రామకృష్ణమాచార్యులు, గోపాలాచార్యులు, శేషాచార్యులు, వేంకటకృష్ణమాచార్యులు నను నలుగురుకుమారులును, నలువురు కూఁతుండ్రును గలిగిరి. ధర్మవరమునఁ గుమారులచదువునకుఁ దగిన యానుకూల్యము లేనందున, స్వకుటుంబముతో వీరు బళ్ళారికిఁబోయిరి. అచ్చట పురాణకాలక్షేపము చేయుచు, గొప్పగొప్పవారి యాశ్రయము సంపాదించి, తమ పుత్త్రిలను చక్కని విద్యలందు సుశిక్షితులుగా నొనర్చిరి. వీరి నలువుర పుత్త్రిలలోఁ బ్రథములగు రామకృష్ణమాచార్యులే పెక్కు నాటకములను రచించి, యాంధ్రప్రపంచ

## ౧౨ వ పటము.

### కీర్తిశేషు లయిన ధర్మవరము రామకృష్ణమాచార్యులు



మున "ఆంధ్రనాటకపితామహు" లని వినుతి గాంచి, 1912 వ సంవత్సరము నవంబరు నెల ౩0 వ తేదిని పరమపదించిన, ధర్మవరము రామకృష్ణమాచార్యులవారు.



3 దుద్దాల నారాయణశాస్త్రిలుగారు—వీరు వైదికస్మార్తబ్రాహ్మణులు. ఇప్పటికి 40 సంవత్సరముల క్రిత మిచ్చట సంస్కృతపండితులుగా నుండి రని తెలియుచున్నది.

౪ పంచకావ్యము రామాచార్యులుగారు—వీరు మాధ్వవైదికబ్రాహ్మణులు. యుక్తవయస్సున వీరికంధత్వము ప్రాప్తించెను. సంస్కృతమునందుఁ బంచకావ్యములను ముఖస్థము చేసి, ప్రతిఫలాపేక్ష లేక బ్రాహ్మణబ్రహ్మచారుల కా విద్య నేర్పుచుండిరి. 1916 వ సంవత్సరమున వీరు కాలధర్మము నొందిరి. చనిపోవునప్పటికి వీరివయస్సు 70 సం॥రము లుండవచ్చును.

౫. గోపాళము (బండ మీఁద) చిన్నప్పగారు—వీరు దేవాంగులు: వృత్తి నేఁత. ఏఁబది సంవత్సరముల యీడున వీరు హఠయోగమును ధరించి కూరుచున్న చోటినుండి లేవక, ముప్పది యేండ్లు కాలము విడువని పూనికతో దీనిని సాధించి రని తెలియు చున్నది. శా॥ శ ౧౮౧౮(1896-97) వ, దుర్ముఖి నామ సం॥ర మార్గశిర బహుళ 3౦ భానువారమున పగలు ౧౨ గంటలవేళ వీరు దేహధర్మము నొందిరి. వీరి సమాధియొద్ద ప్రతివత్సరమునను సమారాధన (బీదలకు) జరగును.

౬. మద్దిపి హనుమంతప్పనాయఁడుగారు—వీరు మొట్టమొదట నొక సామాన్య రక్షకభటోద్యోగమునఁ బ్రవేశించి, యనంతరము ప్రధానరక్షకులై, రాజకీయభాష యగు నాంగ్లమునందు స్వల్పపరిచితియైన లేకుండినను, తమ తెలివి తేటలచేతను, నిరుపమాన ధైర్యసాహసములవలనను, గుంటూరు-నర్సారావుపేట- మచిలీపట్టణము మున్నగు ప్రదేశములయందు పోలీసు ఇన్‌స్పెక్టరీ యుద్యోగమును గూడ, సంస్తవనీయముగ నిర్వర్తించిరి. వీరిని గూర్చి పోలీసు ఇన్‌స్పెక్టరు జనరలుగా రిట్లు నుడివియున్నారు. The Acting Inspector Hanumanthappa Naidu did excellent work and showed unusual detective ability and praise-worthy energy "Guy Lane" 11-2-1902. తాత్కాలిక రక్షకవిమర్శకుఁడగు హనుమంతప్పనాయఁడు రహస్యాపరాధశోధనమునం దసాధారణ

పరాక్రమము చూపి సల్పిన యుత్కృష్టకార్యము, శ్లాఘనీయ మైనది "గై లేక్ ౧౧-౨-౧౯౦౨" బహుమాన పురస్సరముగ వీరు పొందిన యిట్టి యోగ్యతాపత్రము లింకను చాలఁ గలవు.

౧౩ వ పటము.

మద్దిపి, హనుమంతప్ప నాయఁడుగారు



నాయఁడుగారి యోగ్యధర్మమును గూర్చియు, గుంటూరు ప్రాంతములయందు వీరు చూపిన కార్యకౌశలమును గుఱించియు, గుంటూరు నగరవాసు లగు బాబు పి. సౌవర్ వాంజీ గారు, వారి వైజయంతీవిలాసగ్రంథమునఁ బద్యరూపమున, విపులముగ వర్ణించి యున్నారు.



